॥ శ్రీహరిః ॥

988

# తిరుప్పావై

## మేలుకొలుపులు

**(విష్ణుసహస్రనామ స్తోత్ర సహితమ్)**

तिरुप्पावै (सटीक्) और विष्णुसहस्रनाम स्तोत्र सहित् - (तेलुगु)

ఆంధ్రానువాదము

**టి.కె.వి. రాఘవన్**

**గీతాప్రెస్**

గోరఖ్‌పూర్ - 273005

॥ శ్రీహరిః ॥

# నివేదన

శ్రీ విష్ణుచిత్తులు (పెరియాళ్వారు) తనకు సాక్షాత్కరించిన విష్ణుభగవానునికి అతని ఆయుధాది పరివారానికి వేలవేలేండ్లు జయం కలగాలని మంగళాశాసనం చేసిన **'తిరుప్పల్లాండు'** శ్రీరంగనాథునకు మాలాకైంకర్యంతో తరించిన (మేలుకొలుపు) భక్తాంఘ్రిరేణువు (తొండరడిప్పొడి ఆళ్వారు) స్వామికి పాడిన **'తిరుప్పళ్ళియెఝుచ్చి'** అపర సీతగా అయోనిజయై జన్మించి విష్ణుచిత్తుల పెంపకంలో త్రికరణశుద్ధిగా కృష్ణపరమాత్మనే వరించి వ్రతరూపంగా గోదాదేవి (ఆండాళ్) పాడిన **'తిరుప్పావై'** తమిళంలో ఉన్నవి. ఈ ప్రబంధాలకు తెలుగు తాత్పర్యం కూర్చిన **టి.కె.వి. రాఘవన్**గారికి, తప్పొప్పులు సరిచూచిన **డా॥ కే.వి. సుందరాచార్యుల**గారికి కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాము.

మిగతాగ్రంథాలవలెనే ఈ 'తిరుప్పావై' ప్రబంధాన్ని ఆదరించి అనుభవించమని పాఠకులకు మనవిచేస్తున్నాము.

**– ప్రకాశకులు**

గీతాప్రెస్, గోరఖ్‌పూర్

# పొదుత్తనియన్లు

మణవాళమహామునిగళ్ తనియన్ - శ్రీరంగనాథులు ప్రసాదించినది

**శ్రీశైలేశ దయాపాత్రం ధీభక్త్యాది గుణార్ణవమ్ ।**
**యతీన్ద్ర ప్రవణం వన్దే రమ్యజామాతరం మునిమ్ ॥**

శ్రీ గురుపరంపర తనియన్ - కూరత్తాళ్వాన్ ఆనతిచ్చినది

**లక్ష్మీనాథ సమారమ్భాం నాథ యామున మధ్యమామ్ ।**
**అస్మదాచార్య పర్యన్తాం వన్దే గురుపరమ్పరామ్ ॥**

ఎంబెరుమానార్ తనియన్ - కూరత్తాళ్వాన్ సాయించినది

**యోనిత్యమచ్యుత పదామ్బుజ యుగ్మరుక్మ**
**వ్యామోహత స్తదితరాణి తృణాయ మేనే ।**
**అస్మద్గురో ర్భగవతోఽస్య దయైకసిన్ధోః**
**రామానుజస్య చరణౌ శరణం ప్రపద్యే ॥**

నమ్మాళ్వార్ తనియన్ - ఆళవందార్ సాయించినది

**మాతాపితా యువతయస్తనయా విభూతిః**
**సర్వం యదేవ నియమేన మదన్వయానామ్ ।**
**ఆద్యస్య నః కులపతే ర్వకుళాభిరామం**
**శ్రీమత్తదంఘ్రియుగళం ప్రణమామి మూర్ధ్నా ॥**

ఆళ్వారులతనియన్ - శ్రీపరాశరభట్టర్ ఆనతిచ్చినది

**భూతం సరశ్చ మహదాహ్వయ భట్టనాథ**
**శ్రీభక్తిసార కులశేఖర యోగివాహాన్ ।**
**భక్తాంఘ్రిరేణు పరకాల యతీన్ద్రమిశ్రాన్**
**శ్రీమత్పరాఙ్కుశమునిం ప్రణతోఽస్మి నిత్యమ్ ॥**

❖ ❖ ❖

# తిరుప్పల్లాండు

## (పెరియాళ్వార్ గానము చేసినది)

పెరియాళ్వార్ తనియన్ - నాథమునులు ఆనతిచ్చిరి

**గురుముఖమనధీత్య ప్రాహ వేదానశేషాన్**
**నరపతి పరిక్ల్పప్తం శుల్కమాదాతు కామః ।**
**శ్వశురమమరవన్ద్యం రఙ్గనాథస్య సాక్షాత్**
**ద్విజకులతిలకం తం విష్ణుచిత్తం నమామి ॥**

పాండియభట్టర్ సాయించినది

**మిన్నార్ తడమదిళ్ శూళి విల్లిపుత్తూ రెన్ఱొరుకాల్,**
**శొన్నార్ కళఱ్కమలం శూడినోం మున్నాళ్**
**కిళియఱుత్తా నెన్ఱురైత్తోం, కీళ్మైయినిల్ శేరుమ్,**
**వళియఱుత్తోం నెంజమే వన్దు**
**పాణ్డియన్ కొణ్డాడ ప్పట్టర్ పిరాన్ వన్దానెన్ఱు**
**ఈణ్డియ శఙ్గ మెడుత్తూద, వేణ్డియ,**
**వేదఙ్గళోది విరైన్దు కిళియఱుత్తాన్,**
**పాదఙ్గళ్ యాముడైయ పత్తు ॥**

★ **పల్లాణ్డు పల్లాణ్డు పల్లాయిరత్తాణ్డు! పలకోడి నూఱాయిరమ్**
**మల్లాణ్డ తిణ్డోళ్ మణివణ్ణా! ఉన్ శేవడి శెవ్వితిరుక్కాప్పు ॥ 1**

**తాత్పర్యము** : జయీభవ! స్వామీ! విజయీభవ! ఎల్లపుడు నీకు జయమగుగాక! వేల సంవత్సరములు, అనేక బ్రహ్మకల్పములు, కాలతత్త్వము ఉన్నంతవరకు వేలకొలది సంవత్సరములు కమలములవంటి నీయొక్క అరుణారుణ పాదారవిందముల సౌందర్యమునకు ఎపుడూ రక్ష కలుగుగాక!

★ **అడియోమో డుం నిన్నోడుం పిరివిన్ఱి ఆయిరం పల్లాణ్డు**
**వడివాయ్ నిన్ వలమార్బినిల్ వాళ్ గిన్ఱమంగైయుం పల్లాణ్డు!**
**వడివార్ శోదివలత్తుఱైయుం శుడరాళియుం పల్లాణ్డు**
**పడైపోర్ పుక్కు ముళఙ్గుం అప్పాఞ్చశన్నియముం పల్లాణ్డే ॥ 2**

**తాత్పర్యము :** మేము నీకు దాసులము, నీవు మాకు స్వామివి. మన బంధము జన్మజన్మాంతరములందు ఎడబాటులేక వేలాది సంవత్సరములు నిత్యముగా నుండుగాక! నీ వక్షమున కుడిప్రక్క నిలచియుండు శ్రీమహాలక్ష్మియు వేల సంవత్సరములు వర్ధిల్లుగాక! సౌందర్యము, తేజస్సు, రెండునుగల నీ కుడిచేతి సుదర్శనచక్రము శత్రునాశకరము, అది వేల సంవత్సరములు వర్ధిల్లుగాక! సేనలు మోహరించిన యుద్ధమున ప్రవేశించి, ఘోషించెడి ఆ పాంచజన్యము వేల సంవత్సరములు వర్ధిల్లుగాక!

**వాళాట్పట్టు నిన్ఱిరుళ్ళీరేల్ వన్దు మణ్ణుం మణముమ్ కొణ్మిన్**
**కూళాట్పట్టు నిన్ఱీర్గళై యెజ్గళ్ కుళువినిల్ పుగుదలొట్టోమ్**
**ఏళాట్కాలుం పళిప్పిలోం నాజ్గళ్, ఇరాక్కదర్వాళ్, ఇలంగై**
**పాళాళాగ ప్పడై పొరుదానుక్కు, పల్లాణ్డు కూరుదుమే ॥ 3**

**తాత్పర్యము :** భక్తులారా! భాగవతులారా! అనంతసుఖదాయకమైన శ్రీమన్ నారాయణుని సేవలు చేయుటయే భాగ్యముగా తలచినవారందరు దయచేయుడు. మాతో కలియుటకు రండు. మృత్సంగ్రహణము, కల్యాణము మొదలగు సేవలయందు అన్వయించుటకు రండు. ధన్యులు కండు. కుక్షింభర జీవులు, వేరు ప్రయోజనములు కోరువారు, మా తోడి కలయికకు అనర్హులు. మేమందరము ఇరువదియొక్క తరములపాటు భగవంతునికి దూరమగు పాపములు లేనివారము. రాక్షసులకు నివాసమగు లంకలోని వారందరిని మూలనాశము అగునట్లు సైన్యము కూర్చుకొని యుద్ధము చేసిన రామునికి జయము పలుకువారము సుమా!

**ఏడునిలత్తిల్ ఇడువదన్ మున్నంవన్దు, ఎజ్గల్ కుళాం పుగున్దు,**
**కూడు, మనముడై యీర్ కళ్ వరంబొళి, వన్దొల్లై క్కూడుమినో**
**నాడునగరముం నన్గఱియ, నమోనారాయణాయ వెన్ఱు,**
**పాడు, మనముడై ప్పత్తరుళ్ళీర్!, వన్దు పల్లాణ్డు కూఱుమినే ॥ 4**

**తాత్పర్యము :** అన్నిరకముల పాపములకు కారణమైన ప్రకృతిలో పడకమునుపే నీచమగు పురుషార్థములు విడిచి, అతిశీఘ్రముగా మాతో వచ్చి చేరుడు. గ్రామములవారు, నగరములవారు బాగుగా తెలిసికొనునట్లు 'నమోనారాయణ'యను మంత్రమును గానము చేయుచు, సదా గానము

చేయుట యందాసక్తిగలిగి, భక్తుల బృందమున చేరి భగవంతునికి మంగళమని పలుకుడు.

**అణ్డక్కులత్తు క్కదిపది యాగి, అశుర రిరాక్కదరై,**
**ఇణ్డై క్కులత్తై యెడుత్తుక్కళైన్ద, ఇరుడీకేశన్ తనక్కు**
**తొణ్డ క్కులత్తిలుళ్ళీర్! వన్దడితొళుదు, ఆయిరనామం శొల్లి,**
**పణ్డైకులత్తై త్తవిర్న్దు, పల్లాణ్డు పల్లాయిరత్తాణ్డెన్మినే ॥ 5**

**తాత్పర్యము :** బ్రహ్మాండ భాండములకు నాయకుడై, దానవుల, రాక్షసుల అసంఖ్యాక సమూహములను నిర్మూలమొనరించిన, హృషీకేశునికి, భక్తుల సమూహముల చేరిన మీరు మీమీ స్వరూప స్వభావములను మార్చుకొని, మాతో వచ్చి చేరి, భగవంతుని పాదారవిందములు సేవించి, ఆతని సహస్రనామములు పలికి, వేల సంవత్సరములు నిత్యముగా నుండవలెనని మంగళాశాసనము చేయుడు.

**ఎన్దై తందై తందై తందై తమ్మూత్తప్పన్ ఏళ్ పడికాల్తొడఙ్గి,**
**వన్దువళివ ళియాట్చెయ్గిన్రోమ్, తిరువోణ త్తిరువిళవిల్**
**అన్దియమ్బోది లరియురువాగి, యరియై యళిత్తవనై,**
**పన్దనైతీర ప్పల్లాణ్డు, పల్లాయిరత్తాణ్డెన్ఱు పాడుదుమే ॥ 6**

**తాత్పర్యము :** నేను మాత్రమే కాదు, నా తండ్రి, అతని తండ్రి, తాతముత్తాతలు, అతని తండ్రియు, తాతయు అనినట్లు ఏడు తరములు మొదలుకొని, వచ్చి పరంపరగా సేవలు చేయుచున్నాము. శ్రవణనక్షత్ర ఉత్సవ సమయమునందు, అసురసంధ్యా సమయున నరసింహుని రూపములో అవతరించి, శత్రువు హిరణ్యకశిపుని వధించిన వానికి, శ్రమ తీరునట్లు నిరంతరము సర్వకాలములు జయము కలుగవలెనని ప్రార్థించెదము.

**తీయిఱ్పొలిగిన్ఱ శెఞ్జుడరాళి, తిగళ్తిరు చ్చక్కరత్తిన్,**
**కోయిఱ్పొఱియాలేయొత్తుణ్డునిన్ఱు, కుడికుడియాట్చెయ్గిన్రోమ్**
**మాయప్పొరుపడై వాణనై, ఆయిరన్తోళుం పొళికురుది**
**పాయ, శుళిత్తియ ఆళివల్లానుక్కు, పల్లాణ్డు కూఱుదుమే ॥ 7**

**తాత్పర్యము :** తేజస్సుగల పదార్థములన్నింటికంటెను, గొప్పగా ప్రకాశించుచు, నిరతిశయమైన ప్రకాశము కల శ్రీసుదర్శన చక్రము

వెలసియున్న ఆలయమై, గుండ్రముగా నున్న చిన్నెలుగల భుజములు కలిగిన, స్వామికి మేము, మా సంతతి సేవలు చేయుచు సాగుచున్నాము. మాయా యుద్ధమందు అందెవేసిన చేయి అగు సేనలుగల బాణుని వేయి భుజములనుండి స్రవించిన రక్తము వెల్లువలై పారునట్లు చుట్టును జ్వలించు సుదర్శనుని నియమించువానికి జయమని పలుకుదము.

**నెయ్యిడై నల్లదోర్ శోఱుం, నియతము మత్తాణి చ్చేవగముమ్,**
**కైయడైక్కాయుం కళుత్తుక్కుప్పూణొడు, కాదుక్కుకుణ్డలముమ్**
**మెయ్యిడ నల్లదోర్ శాన్దముం తన్దు, ఎన్నై వెళ్ళుయిరాక్కవల్ల,**
**పైయ్యుడైనాగ ప్పగైక్కొడియానుక్కు, పల్లాణ్డు కూఱువనే ॥ 8**

**తాత్పర్యము :** నేతితో కూడి, అత్యంత రుచ్యమగు ప్రసాదము, నిరంతరము సమీపముననే యుండి చేయు సేవయు, స్వామి స్వహస్తముతో ప్రసాదించు తాంబూలము, కంఠాభరణములు, చెవులకు ధరించు కుండలములు, మేనిపూతకు తగిన మృదువైన చందనము యిచ్చి, నా వంటివానిని, సాత్వికునిగా చేయ సమర్థుడగు వానిని, విశాలములగు పడగలుగల సర్పములకు శత్రువైన గరుడుని ధ్వజముగా కలిగినవానికి జయమని పలుకుదుము.

**ఉడుత్తు క్కళైన్ద నిన్ పీదగవాడై యుడుత్తు, క్కలత్తదుణ్డు,**
**తొడుత్త తుళాయ్‌మలర్ శూడిక్కళైన్దన, శూడుమిత్తొణ్ణర్ గళోం**
**విడుత్తదిశై క్కరుమం తిరుత్తి, తిరువోణ త్తిరువిళవిల్,**
**పడుత్త పైన్నాగణై ప్పళ్ళికొణ్డానుక్కు, ప్పల్లాణ్డు కూఱుదుమే ॥ 9**

**తాత్పర్యము :** నీవు ధరించి విడిచిన పీతాంబరము ధరించి, నీ భోజనపాత్రయందు మిగిలినది ప్రసాదముగాగొని, నీకు అలంకరించి తీసివేసిన మాలలు కట్టిన తులసి దళములను, శిరసా ధరించు దాసులము మేము. నీచే నిర్దేశింపబడిన కార్యములను కొనసాగించి, శ్రీకరమగు శ్రవణానక్షత్రమున పడకగా అమరి ఉన్న, నీ స్పర్శచే పులకించు ఆదిశేషునిపై పవళించు స్వామికి వేనవేలు సంవత్సరములు జయమగుగాక! అని పలుకుదుము.

**ఎన్నాళ్ ఎంబెరుమాన్ ఉన్దన క్కడియో మెన్ఱెళుత్తుప్పట్ట**
**వన్నాళే, అడియోఙ్గ ళడిక్కుడిల్, వీడు పెత్తు ఉయ్‌న్దదుకాణ్**

**'శెన్నాళ్ తోత్తి, త్తిరుమదురైయుళ్ శిలైగునిత్తు, ఐన్దలైయ**
**పైన్నాగత్తలై పాయ్న్దవనే, ఉన్నై ప్పల్లాణ్డు కూఱుదుమే ॥ 10**

**తాత్పర్యము :** 'నా స్వామీ! మేము నీకే దాసులము' అని పలికెడి మాట మా నోట పలికినది ఏనాడో – ఆనాటినుండి నీ దాసులమయి, మా యింటి/వంశము వారందరము అహంకారాదులు విడచి, జీవనము ధన్యము చేసికొంటిమి. శ్రీకరమగు దినమున, రోహిణీ నక్షత్రమున ప్రభవించి, మధురానగరమున, శత్రువులను వధించి అయిదు విశాలమగు పడగలుగల కాళియుని శిరసున నర్తనమాడిన స్వామివగు నీకు జయము జయమని పలుకుదుము.

★ **అల్వాళక్కొన్నుమిల్లా, అణికొట్టియర్ కోన్, అబిమానతుఙ్గన్**
**శెల్వనై ప్పోల త్తిరుమాలే!, నానుం ఉనక్కుప్పళవడియేన్,**
**నల్వగై యాల్ నమోనారాయణా వెన్ను, నామం పలపరవి**
**పల్వగై యాలుం పవిత్తిరనే! ఉన్నై ప్పల్లాణ్డుకూఱువనే ॥ 11**

**తాత్పర్యము :** దేహాత్మబుద్ధ్యాది వివాదాలలో పాల్గొనని వారి గోష్ఠి నిర్వహించిన శెల్వనంబివలె ఈ దాసుడు నీకనాదికాలం నుండి శేషభూతుడే. పురుషుల చిత్తాపహారం చేయు మోహనమూర్తివైన నీవు నా అహంకారాది దోషాలను పోగొట్ట సమర్థుడవు. అష్టాక్షరాది మంత్రరాజంతో విలక్షణంగా నీకు మంగళం పాడగల వాక్‌శక్తి యుక్తులు నాకనుగ్రహింపుము.

★ **పల్లాణ్డెన్ను పవిత్తిరనై, పరమేట్టియై, శార్ఙ్గమెన్నుమ్**
**విల్లాణ్డాన్ తన్నై, విల్లిపుత్తూర్ విట్టుశిత్తన్ విరుమ్బియశొల్,**
**నల్లాణ్డెన్ను నవిన్రురైప్పార్, నమోనారాయణాయ వెన్ను,**
**పల్లాణ్డుం పరమాత్మనై, చ్చూడిన్దిరున్దేతుత్వర్ పల్లాణ్డే ॥ 12**

**తాత్పర్యము :** నారాయణమూర్తి పవిత్రములకెల్ల పవిత్రమైనవాడు. ఆ శార్ఙ్గధన్వుడైన పరమపదవాసునకు సర్వమంగళములు కలుగవలెనని శ్రీవిల్లిపుత్తూరులో జన్మించిన విష్ణుచిత్తులు చెప్పిన ఈ తిరుప్పల్లాణ్డు పాశురాలను అనుసంధించేవారు నారాయణుని చేరి అతనికి నిత్యమంగళం పాడుకొనే భాగ్యాన్ని తప్పక పొందగలరు.

❖ ❖ ❖

(తొండరడిప్పొడి యాళ్వారులు రంగనాథునికి చేసిన మేలుకొలుపు)

# తిరుప్పళ్ళి యెఝుచ్చి

## తనియన్లు

(తిరుమాలైయాణ్డాన్ ఆనతిచ్చినది)

తమేవ మత్వా పరవాసుదేవం
రఙ్గేశయం రాజవదర్హణీయమ్ ।
ప్రాబోధకీం యోకృత సూక్తిమాలాం
భక్తాంఘ్రిరేణుం భగవన్తమీడే ।

మణ్డఙ్గుడియెన్బర్ మామరైయోర్ మన్నియశీర్
తొణ్డరడిప్పొడి తొన్నగరం, వణ్డు
తిణర్త్తవయల్ తెన్నరఙ్గత్తమ్మానై, ప్పళ్ళి
యుణర్త్తుం పిరాన్ ఉదిత్త వూర్.

శ్రీ రంగనాథుని మేలుకొలుపుట

★ కదిరవన్ కుణదిశై చ్చిగరం వన్దణైన్దాన్
కనై యిరు ళగన్ఱదు కాలైయం పొళుదాయ్
మదు విరిన్దొళిగిన మామల రెల్లాం,
వానవ రరశర్గళ్ వన్దు వన్దీణ్డి
ఎదిర్ దిశై నిరైన్దనర్ ఇవరొడుం పుగున్ద,
ఇరుఙ్గళి త్తీట్టముం పిడియొడు మురశుం,
అదిర్ తలిల్ అలైకడల్ పోన్ఱుళదు ఎఙ్గుం,
అరఙ్గత్తమ్మా! పళ్ళియెళున్దరుళాయే ॥ 1 ॥

**తాత్పర్యము :** ఓ రంగనాథా! సూర్యుడు తూరుపుదిశలో ఉదయాద్రిపై చేరినాడు. దట్టమైన చీకటి కరగిపోవుచున్నది. అందమైన ప్రభాతము అయినది. కనుక మేలైన పుష్పములన్నియు వికసించి మకరందము స్రవించుచున్నవి. దివినుండు దేవతలు, భువిని పాలించు రాజులు అహమహమికతో నీ కంట పడవలెనని గుంపులుగా సందడించుచున్నారు. వీరితోపాటు వీరి వాహనములు మగ, ఆడ ఏనుగుల గుంపులు, భేరులు, ధ్వనించుచుండగా, సముద్రమే నాల్గుప్రక్కల ఘోషించుచున్నట్లున్నది. రంగనాథా! శయ్యనుండి లేచివచ్చి మమ్ములను కటాక్షించుము.

**కొళ్ళుఙ్గొడి, ముల్లైయిన్ కొళుమల రణవి,**
**క్కూర్ న్దదు కుణదిశై మారుతం ఇదువో,**
**ఎళ్ళున్దన మలరణై ప్పళ్ళికొళ్ళన్నం**
**ఈన్బని ననైన్ద తమిరుం శిఱగుదఱి,**
**విళుఙ్గియ ముదలైయిన్ పిలమ్బురై పేళ్వాయ్**
**వెళ్ళెయిఱు ఉఱవదన్ విడత్తిను క్కనుఙ్గి**
**అళుఙ్గియ వానైయి నరున్దుయర్ కెడుత్త**
**అరఙ్గత్తమ్మా! పళ్ళియెళున్దరుళాయే ॥ 2 ॥**

**తాత్పర్యము :** రంగనాథా! అందమైన మల్లెతీగలనుండి మధురపరిమళము కొనివచ్చుచు, తూరుపునుండి మందముగ వాయువు వీచుచున్నది. రాత్రిఅంతయు పూలపాన్పున సుఖముగ శయనించిన హంసలు, చల్లని మంచుచే తడిసిన తమరెక్కలు దులుపుకొని, మేల్కొనినవి. గుహవలె పెద్దగా తెరచిన నోటితో తెల్లని కోరలతో కొరకగా, ఆ విషమమగు బాధను పొందిన గజేంద్రుని గొప్ప దుఃఖమును పోగొట్టిన స్వామీ! శయ్యవదలి రమ్ము. మమ్మనుగ్రహింపుము.

**శుడరొళి పరన్దన శూజ్ దిశైయెల్లాం**

**తున్నియ తారకై మిన్నొళి శురుజ్గి**

**పడరొళి పశుత్తనన్ పనిమది యివనో,**

**పాయిరుళ గన్రదు పైమ్బొయి ల్కముగిన్,**

**మడలిడై క్కీఱి వణ్ణాళైగళ్ నాఱ,**

**వైకత్తై కూర్ న్దదు మారుత మిదువో,**

**అడలొళితిగళ్ తరు తిగిరి యన్దడక్కై,**

**అరజ్గత్తమ్మా! పళ్ళియెళున్దరుళాయే ॥ 3 ॥**

**తాత్పర్యము :** రంగనాథా! దిక్కులంతటను వేడియగు సూర్యకిరణములు వ్యాపించినవి. ఆకాశమున మిలమిలలాడెడు తారల కాంతి తరిగిపోయినది. చక్కటి కాంతిగల చంద్రుడు వెలవెలబోయినాడు. ఇదిగో! రాత్రి అంతట వ్యాపించిన చీకటి అంతా కరిగిపోయినది. పచ్చని ఉపవనములలో పోకచెట్లు శాఖలు విచ్చుకొని, అందమైన పోకల గుత్తులు పరిమళములు వెదజల్లుచుండగా తొలిపొద్దు వాయువు వీచుచున్నది. శత్రువులకు సంతాపము కలిగించు చక్రమును ధరించిన విశాలమైన హస్తముగల స్వామీ! శయ్యనుండి లేచిరమ్ము. మమ్ము అనుగ్రహింపుము.

**మేట్టిళ మేదిగళ్ తళైవిడుం ఆయర్కళ్,**

**వేయ్ంకుళ లోశైయుం విడై మణిక్కురలుమ్,**

**ఈట్టియ విశైదిశై పరన్దన వయలుళ్,**

**ఇరిన్దవ శురుమ్బినం ఇలంగైయర్ కులత్తై,**

**వాట్టియ వరిశిలై వానవ రేఱే!**

**మూముని వేళ్వియై క్కాత్తు, అవపిరదం**

**అట్టియ వడుతిర లయోత్తి యెమ్మరశే!**

**అరజ్గత్తమ్మా! పళ్ళియైెళున్దరుళాయే ॥ 4 ॥**

**తాత్పర్యము :** ఏపుగా ఎదిగిన లేతవయసుగల ఆవులను మేతకై పొలమునకు తోలుకొని పోవుచున్న ఆలకాపరులు ఊదెడి పిల్లనగ్రోవి ధ్వనులు, దూడల మెడలో గంటల ధ్వనులు, రెండును కూడిన మధురధ్వని నాలుగు దిక్కుల వ్యాపించినది. సరస్సులలో మధుపానము చేయు తుమ్మెదలు చెదరిపోయినవి. లంకలోని రాక్షసజాతిని సమూలముగా నశింపచేసినవాడా! శ్రేష్ఠమైన కోదండము ధరించినవాడా! దేవాదిదేవా! విశ్వామిత్రుని యజ్ఞమును కాపాడి, అవబృథస్నానము చేయించిన పరాక్రమశీలీ! అయోధ్యరామా! రంగనాథా! శయ్యవదలి రమ్మా! మమ్ము అనుగ్రహింపుము.

**పులమ్బిన పుట్కళుం పూమ్బొళిల్‌గళిన్ వాయ్**

**పోయిత్తు క్కఝ్గల్ పుగున్దదు పులరి,**

**కలన్దదు కుణదిశై కనైకడ లరవం,**

**కళివణ్డు మిళత్తియ కలమ్బగ మ్బునైన్ద,**

**అలజ్గల న్దొడైయల్ కొణ్డు అడియిణై పణివాన్,**

**అమరర్గళ్ పుగున్దనర్ ఆదలిల్ అమ్మా!**

**ఇలంగైయర్ కోన్ వళిపాడు శెయ్ కోయిల్,**

**ఎంబెరుమాన్! పళ్ళియెళున్దరుళాయే ॥ 5 ॥**

**తాత్పర్యము :** రంగనాథా! పుష్పించిన ఉద్యానవనములలో పక్షులు సైతము మేలుకొని కిలకిలలాడుచున్నవి. చీకటిరాత్రి కొంచెము కూడా మిగలలేదు. భగవత్ ఆరాధన సమయము ఆసన్నమయినది. తూర్పున సముద్రము ఘోషించు ధ్వని వ్యాపించినది. మధుపానముచే మత్తిల్లిన తుమ్మెదలు

ఝుంకారము చేయుచు వ్యాపించిన పూలు కూర్చబడిన అందమైన మాలలు చేతబట్టి, దేవతలు, మీ పాదముల కడకు వచ్చి చేరుచున్నారు. లంకాధిపతి విభీషణుని సేవలు నిత్యము పొందెడి స్వామీ! రంగనాథా! శయ్యనుండి బయలు వెడలిరమ్ము.

**ఇరవియర్ మణినెడుం తేరొడుం ఇవరో?**
**ఇఱైయవర్ పదినొరు విడైయరుం ఇవరో,**
**మరువియ మయిలిన నఱుముగన్ ఇవనో?**
**మరుదరుం వశుక్కళుం వన్దు వన్దీణ్డి,**
**పురవియో డాడలుం పాడలుం తేరుం,**
**కుమరదణ్డం పుగున్దీణ్డియ వెళ్ళమ్,**
**అరువరై యనైయనిన్ కోయిల్ మున్ ఇవరో?**
**అరజ్ఞత్తమ్మా! పళ్ళియెళున్దరుళాయే ॥ 6 ॥**

**తాత్పర్యము :** కాంతివంతములు, ఉన్నతములగు రథములతో ద్వాదశ ఆదిత్యులు, వృషభవాహనులై లోకపాలకులగు రుద్రులు పదకొండు మంది, నిత్యము తనతో ఉండెడి నెమలి వాహనముగాగల షణ్ముఖుడు, సప్తమరుత్తులు, అష్టవసువులు, అహమహమికతో వచ్చి, నీ ముంగిట గుమికూడిరి. వీరి వాహనములైన అశ్వములు, రథములు, అన్నింటితో ఆడుచు, పాడుచు, సేనాపతియగు కుమారస్వామిని పురస్కరించుకొని దేవతలసేన మేరుపర్వతమును పోలిన నీ కోవెలముందు ఎదురుగా నిలిచియున్నారు. రంగనాథా! మేలుకో! మమ్మేలుకో!

**అన్దర త్తమరర్ గళ్ కూట్టజ్ఞల్ ఇవైయో?**
**అరున్దవ మునివరుం మరుదరుం ఇవరో?**

**ఇన్దిర నానైయుం తానుం వన్దివనో?**
**ఎమ్బెరుమాన్! ఉనకోయలిన్ వాశల్,**
**శున్దరర్ నెరుక్క విచ్చాదరర్ నూక్క**
**ఇయక్కరుం మయఙ్గినర్ తిరువడిత్తొళువాన్**
**అన్దరం పారిడ మిల్లై మత్తిదువో?**
**అరఙ్గత్తమ్మా! పళ్ళియెళున్దరుళాయే ॥ 7 ॥**

**తాత్పర్యము :** మా స్వామీ! రంగనాథా! నీ గుడిముంగిట ఇంద్రుడు, తనవాహనమైన ఐరావతముతో నిలిచియున్నారు. బ్రహ్మాండములోని దేవతలు అందరు సపరివారముగా వచ్చియున్నారు. అఖండ తపోధనులు సనకాదులు, మరుద్గణములు, గంధర్వులు, క్రిక్కిరిసియుండగా విద్యాధరులు సందడింపగా, యక్షులు సైతము నీపాదసేవకై పరవశులైయున్నారు. కదలుటకు, మెదలుటకు నింగియందుగాని, నేలమీదగాని అవకాశమే లేదు. రంగనాథా! మేలుకో.

**వమ్బవిళ్ ఆనవర్ వాయుఱైవళఙ్గ,**
**మానిదికపిలై ఒణ్ కణ్ణాడిముదలా,**
**ఎమ్బెరుమాన్ పడిమైక్కలం కాణ్డఱ్కు,**
**ఏఱ్పనవాయిన కొణ్డు నమ్మనివర్,**
**తుమ్బురు నారదర్ పుగున్దన రివరో**
**తోన్టిన నిరవియుం తులఙ్గొళి పరప్పి,**
**అమ్బర తలత్తునిన్ట గల్గిన్ట దిరుళ్ పోయ్,**
**అరఙ్గత్తమ్మా! పళ్ళియెళున్దరుళాయే ॥ 8 ॥**

**తాత్పర్యము :** రంగనాథా! నీకు సమర్పించవలెనని మంచి సువాసనగల వట్టివేరులను, ధనరాశుల నిధులను, దేవతలు కొనివచ్చినారు. కనులు తెరచిన వెంటనే దర్శింపతగిన శుభకరమగు కపిలధేనువును, నిలువుటద్దము మొదలగు పరికరములను, ఉపకరణములను కొనివచ్చినారు. ఉత్తములగు మహర్షులు, మధురగాయకులు తుంబుర నారదులు వచ్చినారు. సూర్యుడు కూడా తన తేజమును అంతటను వ్యాపింపచేసినాడు. ఆకాశమున చీకటి యన్నదే లేదు. రంగనాథా! కన్నులు తెరచి మమ్మనుగ్రహింపుము.

★ **ఏదమిల్ తణ్ణుమై ఎక్కం మత్తళి**
**యాళ్‌కుళల్ ముళువమోదు ఇశైదిశై కెళుమి,**
**కీదజ్గళ్ పాడినర్ కిన్నరర్ కెరుడర్ గళ్,**
**కన్దరువ రవర్ కజ్గులు ళెల్లామ్,**
**మాదవర్ వానవర్ శారణర్ ఇయక్కర్,**
**శిత్తరుం మయజ్గినర్ తిరువడి త్తొళువాన్**
**ఆదలిలవర్కు నాళోలక్కం అరుళ**
**అరజ్గత్తమ్మా! పళ్ళియైళున్దరుళాయే ॥ 9 ॥**

**తాత్పర్యము :** రంగనాథా! సులక్షణయుతమైన డప్పులు, ఏకతంత్రీవీణలు, మృదంగ వీణా, వేణువుల రవములు దిక్కుల వ్యాపించుచుండగా, కిన్నరులు, గరుడులు గానము చేయుచున్నారు. గంధర్వులు, తపస్సంపన్నులగు ఋషులు, దేవతలు, చారణులు, యక్షులు, సిద్ధులు, నీ పాదసేవకై ఎదురుతెన్నులు చూచుచు అలసియున్నారు. వారలకు విశ్వరూప సందర్శన చేయుటకై రంగనాథా! మేలుకొనుము. శయ్యవీడి రమ్ము!

★ **కడిమలర్ కమలఙ్గళ్ మలర్ న్దన ఇవైయో?**
**కదిరవన్ కనైకడల్ ముళైత్తన నివనో?**
**తుడి యిడైయార్ శురికుళల్ పిళిన్దుదఱి**
**తుగిలుడు త్తేఱినర్ శూళ్ పున లరఙ్గా!**
**తొడైయొత్త తుళవముం కూడైయుం పొలిన్దు**
**తొన్ఱియ తోళ్ తొణ్డరడిప్పొడి యెన్నుమ్**
**అడియనై అళియ నెన్నరుళి ఉన్నడియార్కాళ్**
**పడుత్తాయ్! పళ్ళియైళున్దరుళాయే ॥ 10 ॥**

**తాత్పర్యము :** కావేరీ తీర నివాసీ! రంగనాథా! పరిమళించెడి తామరలు బాగుగా వికసించినవి. ఘోషించు తూర్పు సముద్రము వీడి సూర్యభగవానుడు ఉదయించి ఉదయపర్వతశిఖరము చేరినాడు. డమరుకము వంటి సన్నని నడుముగల స్త్రీలు, తడసిన వెంట్రుకల కొప్పులు పిండి విదలించుకొని, తడిబట్టలు ధరించి నదిలోనుండి బయల్వెడలిరి. నీకు సమర్పించుటకు యోగ్యత కలుగునట్లు పూలబుట్టల అందగించెడి భుజములున్న భక్తపాదరేణువును (తొండరడిప్పొడి) దాసుడనైన నన్ను యోగ్యునిగా భావించి, దయచూపి నీ దాసులకు దాసుని చేయుటకై రంగనాథా! శయ్య వదలిరమ్ము! మేలుకొనుము.



॥శ్రీహరిః॥

శ్రీ ఆండాళ్ ప్రసాదించిన

# తిరుప్పావై

## తనియన్లు

(శ్రీపరాశరభట్టర్ ఆనతిచ్చినది)

నీళాతుఙ్గస్తనగిరి తటీ సుప్త ముద్బోధ్య కృష్ణం
పారార్థ్యం స్వం శ్రుతిశతశిర స్సిద్ధమధ్యాపయన్తీ!
స్వోచ్ఛిష్టాయాం స్రజి నిగళితం యా బలాత్కృత్య భుంక్తే
గోదా తస్యై నమ ఇదమిదం భూయ ఏవాస్తు భూయః ॥

(ఉయ్యక్కొణ్డార్ ఆనతిచ్చినది)

అన్నవయల్ పుదువై యాణ్డాళ్, అరఙ్గఱ్కు
పన్ను తిరుప్పావై ప్పల్ పదియం - ఇన్నిశై యాల్
పాడి క్కొడుత్తాళ్ నఱ్పామాలై, పూమాలై
శూడి కొడుత్తాళై చ్చొల్లు.
శూడి క్కొడుత్త శుడర్కొడియే, తొల్పావై
పాడి యరుళవల్ల పల్ వళైయామ్! నాడి నీ
వేఙ్గడవఱ్కు ఎన్నై విది యెన్ఱ ఇమ్మాత్తమ్
నాం కడవా వణ్ణమే నల్గు.

★ **మార్గళి త్తింగళ్ మది నిరైంద నన్నాళాల్**
**నీరాడ ప్పోదువీర్! పోదుమినో నేరిళైయీర్!**
**శీర్మల్గుమ్ ఆయ్ప్పాడి చ్చెల్వ చ్చిరు మీర్గాళ్**
**కూర్వేల్ కొడున్ తొళిలన్ నందగోపన్ కుమరన్**
**ఏరార్ంద కణ్ణి యశోదై ఇళమ్ సింగమ్**
**కార్మేని చ్చెంగణ్ కదిర్ మదియమ్పోల్ ముగత్తాన్**
**నారాయణనే నమక్కే పరైదరువాన్**
**పారోర్ పుగళ ప్పడిందు ఏల్ ఓర్ ఎంబావాయ్ (1)**

**సందర్భము :** గోపికలు వ్రతమునకు తగిన కాలాన్ని పొగడుతున్నారు

**తాత్పర్యము :** శ్రీమన్నారాయణునికి అత్యంతప్రియమైన మార్గశిర మాసమిది. పున్నమిచంద్రుడు పదహారు కళలతో నిండుగా వెలిగే మంచి రోజులివి. కాత్యాయనీ వ్రతము చేయసంకల్పించి, వ్రతస్నానము చేయుటకు మాతో రాదలచినవారు అందరూ రండి. విశేషమైన ఆభరణములుగల పడతులారా! సిరులు పొంగిపొరలే వ్రేపల్లెలో జనించిన, యుక్త వయస్కులైన పడుచులారా రండి! రండి! క్రూరమైన వేలాయుధము ధరించి, గొప్పపనులు చేయువాడు అగు నందగోపుల కుమారుడు, విశాలమైన, అందమైన కన్నుల యశోదాదేవి ముద్దుల బాలసింహము, నల్లనిమేను, ఎర్ర కలువల కన్నులు గల దొర, సూర్యచంద్రులను పోలిన అందమైన ముఖము గలవాడు అగు, (నేడు కృష్ణునిగా అవతరించిన) నారాయణమూర్తి వ్రతము చేయదలచిన మనకు పర అనే వాద్యమును తప్పక యిచ్చును. లోకులందరు కీర్తించేవిధముగా ప్రవేశించండి.

**విశేషము :** మొదటి పాశురములో గోపికలు వ్రతమునకు తగిన సమయము అనాయాచితముగా లభించిందని ఆనందము వ్యక్తం చేస్తున్నారు)

❖ ❖ ❖

**వైయత్తు వాళ్వీర్‌గాళ్! నాముమ్ నమ్ పావైక్కు**
**చెయ్యుమ్ కిరిశైగళ్ కేళీరో, పార్కడలుళ్**
**పైయత్తుయిన్ర పరమనడిపాడి**
**నెయ్యుణ్ణోమ్ పాలుణ్ణోమ్, నాట్కాలే నీరాడి**
**మైయిట్టు ఎళుదోమ్ మలరిట్టు నామ్ ముడియోమ్**
**శెయ్యాదన శెయ్యోమ్ తీక్కురళై శ్నెన్రు ఓదోమ్**
**ఐయముమ్ పిచ్చైయుమ్ ఆందనైయుమ్ కైకాట్టి**
**ఉయ్యుమారు ఎణ్ణి ఉగందు ఏల్ ఓర్ ఎంబావాయ్ (2)**

**తాత్పర్యము :** వ్రేపల్లెలో నివసించుచు, సుఖించు గోపికలారా! మనము ఆచరించెడి వ్రతమున ఆచరింపవలసిన విధులు వినుడు. పాలకడలిలో శయనించిన పరమపురుషుని పాదముల వైభవము గానము చేయుదము. నేతినిగాని, పాలనుగాని ఆస్వాదించుట మానివేయుదము. ఉదయముననే వ్రతస్నానము చేయుదము. కన్నుల కాటుక ధరింపము. తలను పూలు ముడువము. పెద్దలు కూడదనిన పనులు చేయము. ఒకరి గురించి (ఎవరి గురించి అయినను) కఠినమైన పలుకులు (చాడీలు) పలుకము. అతిథి అభ్యాగతులకు మనశక్తిని అనుసరించి దానము చేసి జీవనము ధన్యమగునటుల తెలియదగిన ఆరు విషయములు ఎరిగి సుఖించెదము. ఇదియే మనమాచరించెడి అద్వితీయవ్రతము.

**విశేషము :** (ఈ పాశురమునందు వ్రతమునకు అంగములగు నియమములు వివరించుట జరిగినది.)

❖ ❖ ❖

★ **ఓంగి ఉలగళంద ఉత్తమన్ పేర్ పాడి**
**నాంగళ్ నంబావైక్కుచ్చాత్తి నీరాడినాల్**
**తీంగిన్రి నాడెల్లామ్ తింగళ్ ముమ్మారి పెయ్దు**
**ఓంగు పెరుం శెన్నల్ ఊడు కయల్ ఉగళ**
**పూంగువళై ప్పోదిల్ పొరిపండు కణ్పడుప్ప**
**తేంగాదే పుక్కిరుందు శీర్తములై పత్తి**
**వాంగక్కుడమ్ నిరైక్కుమ్ వళ్ళల్ పెరుమ్ పశుక్కళ్**
**నీంగాద శెల్వమ్ నిరైందు ఏల్ ఓర్ ఎంబావాయ్. (3)**

**తాత్పర్యము :** గోపికలారా! వడుగుగావచ్చి, పొడుగుగా ఎదిగి, మూడు లోకముల కొలుచుకొన్న ఉత్తముడు, పరమాత్మనామము కీర్తించి, మనము వ్రతముపేరిట స్నానము చేసినచో ఈతిబాధలు తొలగునటుల దేశమునందు అంతట నెలకు మూడు వానలు కురియగా, బాగుగా గుబురుగా ఎదిగిన ఎర్రని వరిదుబ్బుల నడుమ నీటిలో చేపలు తుళ్లి తుళ్లి పడుచుండగా, కలువరేకుల నడుమ అందమైన తుమ్మెదలు హాయిగా నిదురించునటుల, ఏమాత్రము జంకక, గొంకక, పశువుల కొట్టములో ప్రవేశించి, స్థిరముగా కూర్చుండి, బలసిన పొదుగు సిరములను పట్టి పిండగా, లెక్కకు మిక్కిలి కుండలు పాలతో నింపునటుల ఔదార్యముగల పాడిపశువులుండెడి మితిలేని సంపద స్థిరముగా నిలచును. ఇట్టి ఫలములిచ్చునది మనమాచరించు అద్వితీయమగు భవ్యమగు వ్రతము.

**విశేషము :** (ఈ పాశురములలో కాత్యాయినీ వ్రతము అనుష్ఠించినందు వలన కలుగు ఫలితము చెప్పుచున్నారు.)

❖ ❖ ❖

**ఆళి మళైక్కణ్ణా! ఒన్రు నీ కైకరవేల్**
**ఆళియుళ్ పుక్కుముగన్దు కొడార్ త్తేరి**
**ఊళి ముదల్వన్ ఉరువమ్ పోల్ మెయ్‌కరుత్తు**
**పాళియన్ తోళుడైప్పర్పనాబన్ కైయిల్**
**ఆళిపోల్ మిన్ని, వలంబురి పోల్ నిన్రు అదిర్న్దు**
**తాళాదే శార్ఙ్గ ముదైత్త శరమళైపోల్**
**వాళ ఉలగినిల్ పెయ్‌దిడాయ్ నాంగళుమ్**
**మార్గళి నీరాడ ముగిళ్న్దు ఏల్ ఓర్ ఎంబావాయ్ (4)**

**తాత్పర్యము :** మండలాకృతిలో వర్షించు మేఘమా! వరుణదేవా! దయచేసి నీవు చేతిని ముడుచుకొనవద్దు. (విస్తారముగా వర్షించవలెనని ప్రార్ధన.) నీవు సముద్రములో ప్రవేశించి, బాగుగా నీటిని త్రాగవలెను. తృప్తిగా గర్జించవలెను. ఆకాశమునందు వ్యాపించవలెను. సృష్టికి మూలకారణతత్త్వమగు పరమాత్మ మేనిఛాయవలె నల్లబడవలెను. అందమైన, బలమైన భుజములుగల పద్మనాభుని చేతిలోని సుదర్శన చక్రమువలె మిరుమిట్లుగొల్పవలెను. ఆతని చేతిలోని దక్షిణావర్త పాంచజన్య శంఖమువలె నిలచి (ఎక్కువ సమయము) పెద్దగా ధ్వనించవలెను. (ఉరుమవలెను.) పిదప ఏ మాత్రము ఆలసింపక స్వామి చేతిలోని శార్ఙ్గము నుండి వెలువడు బాణముల పరంపరలవలె వర్షధారలు కురియవలెను. అపుడు మేము కూడ మార్గశిరస్నానము చేసి ఆనందించెదము.

ఈ పాశురమున పర్జన్యదేవుని గోపికలు ప్రార్థించుచున్నారు.

**విశేషము :** (భగవద్భక్తులకు దేవతలు సైతము తోడుగా నిలతురన్న భావము వివరింపబడినది)

❖ ❖ ❖

**మాయనై మన్ను వడమదురై మైన్దనై**
**తూయ పెరునీర్ యమునై తురైవనై**
**ఆయర్ కులత్తినిల్ తోన్రుమ్ మణివిళక్కై**
**తాయై క్కుడల్ విళక్కం శెయ్ద దామోదరనై**
**తూయోమాయ్ వన్దు నామ్ తూమలర్ తూవిత్తొళుదు**
**వాయినాల్ పాడి మనత్తినాల్ శిన్దిక్క**
**పోయ పిళైయుమ్ పుగుదరువా నిన్రనపుమ్**
**తీయినిల్ తూశాగుమ్ శెప్పు ఏల్ ఓర్ ఎంబావాయ్ (5)**

**తాత్పర్యము :** చెలులారా! మన వ్రతమునకు నిర్వాహకుడగు ఆ కృష్ణుడు అఘటనఘటనా సమర్థుడగు మాయావి. స్థిరమైన ఉత్తర మధురానగరమునకు రక్షకుడగు బలిష్ఠుడు. శుభకరము, విస్తారము అగు జలరాశిగల యమునాతీరవనముల నివసించువాడు. గోపబాలకుల వంశమున ప్రభవించిన మణిదీపము. తల్లియగు దేవకీగర్భము ప్రకాశింపచేసిన దామోదరుడు. ఆతనిని మనము పరిశుద్ధులమై చేరవచ్చి, పవిత్రమగు పుష్పములు చల్లి, సేవించగా, నోరారా కీర్తించి, మనసారా చింతించిన, మనము వెనుకటి రోజులలో చేసిన పాపములు (పూర్వాఘములు) రాబోవు దినములలో చేయబోయెడి చెడుపనులు ఫలములు (ఉత్తరాఘములు) నిప్పున పడవేసిన దూదిపింజలవలె నశించునని తెలిసికొనుడు! ఇది అద్వితీయమగు దివ్యమగు వ్రతము.

**విశేషము :** (భగవంతుని అఘటన ఘటనా సామర్థ్యమును తెలిపి విశ్వాసము కలిగించుచున్నారు.

❖ ❖ ❖

**పుళ్ళుమ్ శిలంబినకాణ్ పుళ్ళరైయన్ కోయిలిల్**
**వెళ్ళై విళిశంగిన్ పేరరవమ్ కేట్టిలైయో?**
**పిళ్ళాయ్ ఎళున్దిరాయ్! పేయ్ ములై నఞ్జుండు**
**కళ్ళచ్చగడమ్ కలక్కళియ క్కాలోచ్చి**
**వెళ్ళ త్తరవిల్ తుయిల్ అమర్న్ద విత్తినై**
**ఉళ్ళత్తు క్కొండు మునివర్గళుమ్ యోగిగళుమ్**
**మెళ్ళ ఎళున్దు అరియెన్ర పేరరవమ్**
**ఉళ్ళమ్ పుగుందు కుళిర్న్దు ఏల్ ఓర్ ఎంబావాయ్ (6)**

**తాత్పర్యము :** ఓ గోపికా! పక్షులన్నియు కలకలమని ఒకదానిని ఒకటి పిలుచుకొనుచున్నవి చూడు. పక్షులరాజగు గరుత్మంతుని దేవాలయములో తెల్లనైన శంఖమునుండి వెలువడు పెద్దధ్వని నీవు వినలేదా! పిల్లా! లేచిరా! రాక్షసియగు పూతనస్తనములందలి విషమును ఆరగించినవానిని, దొంగబండిని సంధులు చెడునట్లు తన్నినవానిని, పాలకడలిలో తెల్లని ఆదిశేషునిపై అమరియుండి యోగనిద్ర చెందినవానిని, సృష్టికి మూలమగు బీజమువంటివానిని, మనసున నిలుపుకొన్న మునులు, యోగులు మెల్లగా మేలుకొనుచు, హరిహరి యను నామస్మరణ చేయు ఘోష, మా మనసుల ప్రవేశించి, పరవశింపజేయుచున్నది.

ఇది భవ్యమగు అద్వితీయమగు మన వ్రతము.

**విశేషము :** (ఈ పాశురము మొదలు 10 పాశురములవరకు 10 మంది గోపికలను మేలుకొలుపుట గలదు.

❖ ❖ ❖

**కీశు కీశెన్రు ఎంగుమ్ ఆనైచ్చాత్తమ్ కలన్దు**
**పేశిన పేచ్చరవమ్ కేట్టిలైయో? పేయ్ ప్పెణ్ణే!**
**కాశుమ్ పిరప్పుమ్ కలగలప్పక్కై పేర్తు**
**వాశ నరుంకుళల్ ఆయ్చ్చియర్ మత్తినాల్**
**ఓశై పడుత్త త్తయిర్ అరవమ్ కేట్టిలైయో?**
**నాయగప్పెణ్ పిళ్ళాయ్! నారాయణన్ మూర్తి**
**కేశవనై ప్పాడవుమ్ నీ కేట్టే కిడత్తియో?**
**తేశముడైయాయ్! తిర ఏల్ ఓర్ ఎంబావాయ్ (7)**

**తాత్పర్యము :** ఓ గోపికా! భరద్వాజపక్షులు ఎల్లెడల కీచుకీచుమని ధ్వనిచేయుచు పరస్పరము పలుకరించుకొనుచున్నవి. ఆ పక్షికూతల ధ్వని వినిపించలేదా! పిచ్చిపిల్లా! తాము ధరించిన అచ్చుతాళి, తటుబొట్టు ఒకదానితో ఒకటి ఒరుసుకొని గలగల శబ్దము చేయునటుల, చేతులు బాగుగా చాచి, పరిమళించుకేశభరముగల గోపకాంతలు పెరుగు చిలుకునప్పటి ధ్వని వినబడుటలేదా? మా కందరికి నాయకమణి వంటిదానవే! కృష్ణునిగా అవతరించిన శ్రీమన్నారాయణుని, కేశవుని మేము కీర్తించుచుండగా నీవు వినియుండియు నిద్రించుచున్నావా? తేజశ్శాలీ! తెల్లవారినది! మేలుకో! తలుపులు తెరువుము.

**గమనిక :** దక్షిణాదియందు పెండ్లికుమార్తెకు రెండురకముల తాళిబొట్టులు రెండుపక్షములవారు యిచ్చుట సంప్రదాయము అని 'ఉచ్చుత్తాళి–అమైత్తాళి' అని అందురు.



**కీళ్వానమ్ వెళ్ళెన్రు ఎరుమై శిరువీడు**

**మేయ్వాన్ పరన్దన కాణ్! మిక్కుళ్ళ పిళ్ళైగళుమ్**

**పోవాన్ పోగిన్రారై ప్పోగామల్ కాత్తు ఉన్నై**

**క్కూవువాన్ వన్దు నిన్రోమ్ కోదుకుల ముడైయ**

**పావాయ్! ఎళున్దిరాయ్ పాడిప్పరై కొండు**

**మావాయ్ పిళన్దానై మల్లరై మాట్టియ**

**దేవాదిదేవనై చ్చెన్రను నామ్ శేవిత్తాల్**

**ఆవావెన్రు ఆరాయ్న్దు అరుళ్ ఏల్ ఓర్ ఎంబావాయ్ (8)**

**తాత్పర్యము :** ఓ గోపికా! ఆకాశము క్రిందిభాగము తెల్లబడినది. (తెల్లవారినది). గేదెలు ఉదయపు చిరుమేతకై చిన్నబీడులలోనికి విడువబడినవి. తక్కిన గోపబాలికలందరు, వ్రతమునకు పోవుటయే లక్ష్యముగా పోవుచుండగా, వారిని అడ్డగించి, పోనీయక, నిన్ను పిలుచుకొని పోవుటకై వచ్చి నీ యింటిముందు నిలిచినాము. భగవంతునియందు కుతూహలము, మాయందు వేడుకగల పిల్లా! లేచిరావమ్మా! ఆతనిని కీర్తించెదము. పర అను వాద్యము పొందెదము. గుఱ్ఱము రూపమున వచ్చిన కేశి దౌడలు చీల్చినవానిని, చాణూరముష్టికులను మల్లురను మట్టిగరపించినవానిని దేవాదిదేవుని మనము చేరి సేవించిన, ఆతడు 'ఓహో! ఓహో!' అని ఆత్రుతపడి, మనము వచ్చిన పనిని విచారించి, దయచూపును.

ఇది అద్వితీయమగు మన వ్రతము–



**తూమణి మాడత్తు చ్చుత్తుమ్ విళక్కెరియ**

**తూపం కమళ త్తుయిల్ అణై మేల్ కణ్ వళరుమ్**

**మామాన్ మగళే! మణిక్కదవమ్ తాళ్ తిరవాయ్**

**మామీర్! అవళై ఎళుప్పీరో! ఉన్‌మగళ్‌తాన్**

**ఊమైయో? అన్రిచ్చెవిడో? అనన్దలో?**

**ఏమప్పెరున్దుయిల్ మన్దిరప్పట్టాళో?**

**"మామాయన్ మాదవన్ వైకున్దన్" ఎన్రెన్రు**

**నామమ్ పలవుమ్ నవిన్రు ఏల్ ఓర్ ఎంబావాయ్ (9)**

**తాత్పర్యము :** స్వభావసిద్ధమైన మణులు తాపిన మేడలో, చుట్టూ దీపములు వెలుగుచుండగా, సుగంధభరితమైన ధూపము వ్యాపించగా స్పర్శమాత్రమున సుఖము కలిగించు శయ్యపై, నిదురించెడి మామ కూతురా! మణులు పొదిగిన తలుపుగడియ తెరువమ్మా! అత్తయ్యా! మీరైనను ఆమెను మేలుకొలుపరా! అయ్యో! మీ కుమార్తె మూగదయినదా? చెవిటిదయినదా! లేదా సోమరితనమా! కాకున్న ఇంత మొద్దునిద్రకై ఎవరైన మంత్రించినారా ఏమి? కావలి ఉంచినారా? చిత్రవిచిత్రములగు కర్మలు ఆచరించువాడని, మాధవుడని, వైకుంఠుడని పలు రకములుగా నామములను పలుకుచున్నాము. ఇదియే ఒక అద్వితీయమగు మా వ్రతము.



**నోత్తు చ్చువర్క్కమ్ పుగుగి్రన అమ్మనాయ్!**

**మాత్తముమ్ తారారో వాశల్ తిరవాదార్?**

**నాత్తత్తుళాయ్ ముడి నారాయణన్ నమ్మాల్**

**పోత్తప్పరై తరుమ్ పుణ్ణియనాల్ పండు ఒరునాళ్**

**కూత్తత్తిన్ వాయ్ వీళ్న్ద కుంబకరణనుమ్**

**తోత్తుమునక్కే పెరున్దుయిల్ తాన్ తన్దానో?**

**ఆత్త అనన్దలుడైయాయ్! అరుంగలమే!**

**తేత్తమాయ్ వన్దు తిర ఏల్ ఓర్ ఎంబావాయ్ (10)**

**తాత్పర్యము :** శ్రీకృష్ణస్వామి ఇంటికి పొరుగున ఉండుటకు నోము నోచి పుట్టినదానా! స్వర్గసుఖానుభవము పొందనోచినదానా! అదృష్టవంతురాలా! మా పిలుపునకు బదులైన చెప్పరాదా, తలుపైనను తెరువరాదా! పరిమళించు తులసిని శిరసున ధరించు శ్రీమన్ నారాయణుడు మన అందరి స్తోత్రములకు పరవశించి పర అను వాద్యమును యివ్వగలడు. పుణ్యముల పంటయగు ఆతనిచేత ఒకానొకనాడు మృత్యువు నోటబడిన కుంభకర్ణుడు నిద్రపోవుటయందు పోటీపడి, నీవలన పరాజయము పొంది, తనకు తానే నీకు మొద్దునిద్దుర స్వయముగా ధారపోసెనా ఏమి? ఇంతటి సోమరితనమా! మా అందరకు ఆభరణమువంటిదానా! నీవు మెలకువతెచ్చుకొని, సావధానముగా లేచి రమ్ము. తలుపు తెరువుము. ఇది మా అద్వితీయమగు వ్రతము. గుర్తెరుగుము.

❖ ❖ ❖

**కత్తుక్కరవై క్కణంగళ్ పలకరన్దు**
**శెత్తార్ తిరల్ అళియ చ్చెన్రు శెరుచ్చెయ్యుమ్**
**కుత్త మొన్రిల్లాద కోవలర్ తమ్ పొర్కొడియే**
**పుత్తు అరవు అల్గుల్! పునమయిలే! పోదరాయ్**
**శుత్తత్తు త్తోళిమార్ ఎల్లారుమ్ వన్దు నిన్**
**ముత్తమ్ పుగున్దు ముగిల్ వణ్ణన్ పేర్ పాడ**
**శిత్తాదే పేశాదే శెల్వ ప్పెణ్డాట్టి! నీ**
**ఎత్తుక్కు ఉరంగుమ్ పొరుళ్ ఓర్ ఎంబావాయ్ (11)**

**తాత్పర్యము :** యుగమునకు అర్హత కలిగించునటులు, చిన్నచిన్న దూడలుగలిగి వేలాదిగా ఉన్న పశువుల మందలో పాలుపిదుకుట యందు నేర్పరులు మాత్రమేకాక, అవసరమైనపుడు శత్రువుల స్థావరములమీదికి దండువెడలి, వారిభుజబలము అణచగలిగిన శూరులు, దోషగంధరహితులు అయిన గోపాలుర వంశమున జనించిన బంగారుతీగవంటిదానా! పుట్టలోనున్న పామువంటి కటిసౌందర్యము, అడవినెమలి పురివంటి కేశపాశముగలదానా! రావమ్మా – మేలుకోవమ్మా! నీ బంధువులు, స్నేహితులు అందరు వచ్చి చేరి, మీ ముంగిట నిలిచి నీల మేఘశరీరుడగు వెన్నుని నామములు నోరార పాడుచుండగా కదలక, బదులు పలుకకున్నావే! సంపత్స్వరూపమైన ఓ గోపికా! నీవిటుల నిద్రించుటలోని అభిప్రాయమేమి?

ఇది మనము ఆచరించెడి భవ్యవ్రతము.



**కనైత్తిళంగత్తెరుమై కన్రు క్కిరంగి**

**నినైత్తు ములై వళియే నిన్రుపాల్ శోర**

**ననైత్తు ఇల్లమ్ శేరాక్కుమ్ నర్చెల్వన్ తంగాయ్!**

**పనిత్తలై వీళ నిన్ వాశల్ కడైపత్తి**

**శినత్తినాల్ తెన్నిలంగై క్కోమానై చ్చెత్త**

**మనత్తుక్కు ఇనియానై ప్పాడవుమ్ నీవాయ్ తిరవాయ్!**

**ఇనిత్తాన్ ఎళున్దిరాయ్! ఈ తెన్న పేరురక్కమ్!**

**అనైత్తు ఇల్లత్తారుమ్ ఏల్ ఓర్ ఎంబావాయ్ (12)**

**తాత్పర్యము :** ఉదయమే ఆవులకు పాలు పిదుకువారు లేరు. ముందుగా దూడలను విడచువారు లేరు. పాలు చేపుటచే పొదుగు భారమై, తమ దూడలు దూరముగానున్న బాధతో, వానియందలి వాత్సల్యముచేత, అరచుచు అవి తమ పొదుగులో మూతిపెట్టినట్లు భావనచెంది, ఏకధారగా పాలు స్రవించుచుండగా ఇల్లు అంతయు తడిసి, నాని, బురదగా మారుచున్నది. అంతటి గొప్ప పాడిసంపదకలవాని ముద్దుల చెల్లెలా, నీ యింటి ముంగిట నిలిచినాము. తలలపై ఉదయపు మంచు ధారలుగా పారుచున్నది. మేము అలనాడు అందమైన లంకానగరమునకు అధిపతి అయిన వాని వైభవము, క్రోధావేశమున మట్టిగరిపిన మనసున ఎన్నగ వచ్చెడి శ్రీరామచంద్రుని గుణగానము చేయుచున్నాము. నీవు మాత్రము నోరు తెరువవేమి? ఇకనైనను పడకవదలి లేచి రావమ్మా! ఇదేమి మొద్దునిద్దుర తల్లీ! ఈ విషయము ఊరివారందరికి తెలిసియే పోయినది. చాలుచాలు! ఇక రమ్మ! ఇది మనము ఆచరించెడి అద్వితీయమగు వ్రతము.

❖ ❖ ❖

**పుళ్ళిన్ వాయ్ కీండానైప్పొల్లా అరక్కనై**

**క్కిళ్ళి క్కళై న్దానై క్కీర్తిమై పాడిప్పోయ్**

**పిళ్ళైగళ్ ఎల్లారుమ్ పావైక్కళమ్ పుక్కార్,**

**వెళ్ళి ఎళున్దు వియాళమ్ ఉరంగిత్తు!**

**పుళ్ళుమ్ శిలుంబినకాణ్! పోదు అరిక్కణ్ణినాయ్!**

**కుళ్ళ క్కుళిర క్కుడైన్దు నీరాడాదే,**

**పళ్ళిక్కిడత్తియో? పావాయ్! నీ నన్నాళాల్**

**కళ్ళమ్ తవిర్న్దు కలన్దు తిర ఏల్ ఓర్ ఎంబావాయ్ (13)**

**తాత్పర్యము :** కొంగరూపమున వచ్చిన బకాసురుని దౌడలు చీల్చి చంపిన కృష్ణుని, దుర్మార్గుడగు రాక్షసరాజు రావణుని అవలీలగా గిల్లిపారవైచిన శ్రీరామచంద్రుని పరాక్రమాదులను స్తోత్రము చేయుచు, మన తోటి గోపికలు అందరు వ్రతమునకు నిర్దేశించిన వేదీస్థలమున చేరిరి, శుక్రనక్షత్రము ఉదయింపగా బృహస్పతి తార అస్తమించినది. గ్రామపక్షులు ఆహారసంపాదనము కొరకు కిలకిలలాడుచు బయలుదేరినవి. లేడి కన్నులవంటి సౌందర్యముగల కన్నులు గలదానా! (పుష్పమునందున్న తుమ్మెదవలె కాంతితో మెరియు కన్నులు గలదానా). ఈనాడు తాపము తొలగునట్లు చల్లని మడుగులో పూర్తిగా మునిగి స్నానము చేయక, ఇంకను మంచము మీదనే శయనించి ఉన్నావా! మృదుస్వభావము గలదానా! ఇంతటి మంచిరోజున కపటము విడచి మా అందరితో కలియుటకు రమ్ము. ఇది ఒక అద్వితీయవ్రతము.

❖ ❖ ❖

**ఉంగళ్ పుళక్కడై త్తోట్టత్తు వావియళ్**

**శెంగళు నీర్ వాయ్ నెగిళ్న్దు అమ్పల్వాయ్ కూంబినగాణ్**

**శెంగల్ పొడి క్కూరై వెణ్పల్ తవత్తవర్,**

**తంగళ్ తిరుక్కోయిల్ శంగిడువాన్ పోదన్దార్,**

**ఎంగళై మున్నమ్ ఎళుప్పువాన్ వాయ్ పేశుమ్**

**నంగాయ్! ఎళున్దిరాయ్! నాణాదాయ్, నావుడైయాయ్!**

**శంగొడు శక్కరమ్ ఏన్దుమ్ తడక్కైయన్**

**పంగయ క్కణ్ణానై ప్పాడు ఏల్ ఓర్ ఎంబావాయ్ (14)**

**తాత్పర్యము :** పరిపూర్ణురాలా! నీ యింటి పెరటితోటలోని దిగుడుబావిలో ఎర్రకలువలు వికసించినవి, నల్లకలువలు ముకుళించుకొన్నవి (తెల్లవారినదని వీరి భావము). జేగురురంగు రాతిపొడి అద్దిన కాషాయవస్త్రములు ధరించిన సన్న్యాసులు, మఠాధిపతులు, తెల్లని దంతములవారు, 'కుంచెకోల'యను దేవాలయపు తాళపు చెవుల గుత్తిని కొని దేవాలయముల వంక కదలుచున్నారు. మా అందరిని 'ముందుగా నేనే మేల్కొల్పెదను' అని బీరములాడి, ప్రతినలు చేసిన పూర్ణురాలా! సిగ్గువదలినదానా! మాటల చమత్కృతి గలదానా! లేచిరావమ్మా! శంఖము, చక్రము ధరించినవానిని, పంకజనేత్రుని మేము స్తోత్రము చేయుచుండగా మాతోడ కలియుటకు రమ్ము. ఇది మనము ఆచరించు అద్వితీయమగు వ్రతము-

❖ ❖ ❖

**"ఎల్లే! ఇళంగిళియే ఇన్నమ్ ఉరంగుదియో?"**
**"శిల్లెన్రు అళైయేన్మిన్ నంగైమీర్! పోదరుగిన్రేన్"**
**"వల్లీ, ఉన్ కట్టురైగళ్! పణ్డే ఉన్ వాయ్ అరిదుమ్!'**
**"వల్లీర్గళ్ నీంగళే నానే తాన్ ఆయిడుగ!"**
**"ఒల్లై నీ పోదాయ్ ఉనక్కు ఎన్న వేరు ఉడైమై!"**
**"ఎల్లారుమ్ పోన్దారో?" "పోన్దార్ పోన్దు ఎణ్ణిక్కొళ్;**
**వల్లానై కొన్రానై, మాత్తారై మాత్తు అళిక్క**
**వల్లానై, మాయనై ప్పాడు ఏల్ ఓర్ ఎంబావాయ్ (15)**

**తాత్పర్యము :** ప్రక్కయింటివద్ద గోపికల మాటల అలికిడివినిన, మరొక గోపిక నిద్రలేచి గానము మొదలుపెట్టినది. ఆమెను పిలుచువిధానమిది–

**బయటి :** ఏమే లేతచిలుకా! ఇంకా నిదురించుచున్నావా?

**లోపలి :** (చిరుబురులాడుచు) నన్ను అట్లు పిలువవద్దు. మీరే పరిపూర్ణతగల గోపకాంతలు ఇదే వచ్చుచున్నాను.

**బయటి :** సరిసరి! మాటలకట్టు నేర్పుగల నీ మాటలు, నీ నోటి పదును ఎపుడో మేము తెలిసికొన్నాము.

**లోపలి :** మాటలు మాట్లాడుటలో మీరే సమర్థులు లెండి! ఒంటరిదానను నేనే యగుదును.

**బయటి :** సరిసరి! నీవు వెంటనే వెలుపలికి రమ్ము! నీకు వేరేపని ఏమి?

**లోపలి :** మనవారు అందరు గోపికలు వచ్చినారా?

**బయటి :** అందరూ రానేవచ్చిరి. నీవు వెలుపలికివచ్చి – లెక్కించుకొనుము.

(ఆ గోపిక బయటకు వచ్చినది) బలమగు కువలయాపీడమును చంపినవాడు, కంసాది శత్రువుల కసిమసంగినవాడు, అతిమానుష చేష్టలుగల శ్రీకృష్ణభగవానుని గుణగానము చేయుటకు బయలుదేరుదము– (అని బయలుదేరిరి) ఇది మన విలక్షణమైన వ్రతము.

❖ ❖ ❖

